# అంకితం



సర్వ శక్తి మంతుడు, అర్ధనిమీలిత నేత్రుడు, ఆనంద స్వరూపుడు, అనాధ రక్షకుడు, దయాళువు, సర్వేశ్వరుడైన శ్రీశైల మల్లిఖార్జున స్వామికి మాతా భ్రమరాంబికా దేవీలకు అత్యంత వినయ పూర్వక గౌరవ భక్తి ప్రపత్తులతో....

**సురేష్ సిద్ధాంతి**

రచయిత.



# కృతజ్ఞతలు

సాధారణంగా వాస్తు పుస్తకములు ప్రింట్ పుస్తకములుగా రావడం మనందరకు తెలిసినదే. అయితే కాలం మారినది. సమాచార, కంప్యూటర్ విప్లవం వెల్లువెత్తుతున్నది. ***e-book*** అనుమాటను ఈ మధ్యనే ఎక్కువగా వింటున్నాము. బహుశా నాకు తెలిసి వాస్తు శాస్త్రంపై ***e-book*** ఏ భాషలోనూ వెలువడలేదని అభిప్రాయపడుతున్నాను.

భారతీయ భాషలలో, అదియునూ, దక్షిణ భారతదేశ భాషలలో వాస్తుశాస్త్రంపై ఇంతవరకూ ***e-book*** వెలువడలేదు. మొదటిగా ***e-book*** ***www.subhavaastu.com*** సైట్ నుండి వెలువడటం ఆనందంగా ఉంది. ఈ విషయంలో సహకరించిన మరియు సంపూర్ణంగా ఆలోచనను కలుగజేసినటువంటి ఆత్మీయుడు శ్రీ టంగుటూరి నాగరాజు (సియాటెల్, అమెరికా)కు,

***e-book*** ను అత్యంత శ్రద్ధతో చక్కగా రూపొందించి మీకు అందించినటువంటి ప్రియతమ డి.టి.పి. ఆపరేటర్ చి॥ విద్యారూప్‌కు,

ఎన్ని ***e-book*** లు వచ్చినా, తెలిపినచో మొదటిగా మేము కొంటామని తెలిపి ప్రోత్సహించిన వాసవదత్త (కాలిఫోర్నియా, అమెరికా)కు, మధుప్రసాద్ కోదాడ (టొరంటో, కెనడా)కు, భరత్ భూషణ్ (టోక్యో, జపాన్)కు, వెంకటరమణ సాకే (సిడ్నీ, ఆస్ట్రేలియా)కు,



## విషయ సూచిక

# ముందుమాట

527 పేజీలు గల **'శుభవాస్తు'** పుస్తకమును ఊహించిన దాని కన్నా ఎక్కువుగా ఆదరించి ఆప్యాయతతో సహకరించిన మీ అందరుకు ధన్యవాదములు తెలుపుకోవలసిన కర్తవ్యం నాపై వుంది. వాస్తు పుస్తకాలు రావడము మొదలైన ఇన్ని సంవత్సరాల తర్వాత శుభవాస్తు పుస్తకం మార్కెట్‌లోకి విడుదల అయినది. ఈ పుస్తకము విపరీతంగా అమ్ముడు పోతుందని ఊహకు కూడా అందలేదు. కల అసలే కనలేదు. ఈ విజయము అక్షరాల మీది. మీరు ఇంతగా ఆదరించినందుకు మీకు మరొకసారి మనసారా, హృదయపూర్వకంగా ధన్యవాదములు తెలుపుతున్నాను. నిధులు, టి.వి. ఎక్కడ పెట్టాలి, వాస్తు జాతక పిచ్చోళు అప్పులు ఎలా తీర్చాలి, రాజకీయ నాయకులు - వాస్తు , ఫ్యాక్షనిస్టులు - వాస్తు, మీ భార్య మీకు అనుకూలంగా లేదా? ఇతర విషయాలను చదివి, నూతన ఆలోచనలు కలిగినవని, అసలు సిసలైన సంతోషకరమైన జీవితం ఎలా ఉంటుందో తెలుసుకున్నామని, ఇటువంటి పుస్తకాలు ఇంకా ఎన్నింటినో ప్రచురించమని అనేకమంది నాకు ఫోన్ చేసి తమ అభిప్రాయములను తెలిపారు. అందరకూ ధన్యవాదములు.

**'శుభవాస్తు సలహాలు'** (వాస్తు జనరల్ పాయింట్స్), **'వీధిపోట్లు-ఫలితములు', 'వాస్తువిశేషాలు', 'వాస్తు ప్రశ్నలు-సమాధానములు'** విడుదల చేయడము అయినది. వీటికి కూడా అందరి సహకారం లభించడంతో ఊహించని అమ్మకాలు ఏర్పడ్డాయి. మరొకసారి మీకు ధన్యవాదములు తెలుపుకుంటున్నాను. జేబులో పట్టేటువంటి వాస్తు మినీ పుస్తకమును అందించమని ఒక కష్టమర్ బలవంతం చేయడంతో ఈ పుస్తకమును తయారు చేశాము. అలాగే ఈ చిరు పుస్తకమును *e-book* గా తయారుచేసి మీకు అందించాము. అన్ని పుస్తకాలను ఆదరించునటులనే ఈ పుస్తకమును కూడా ఆదరిస్తారని తలచి మీ ముందుకు తీసుకు రావడము జరిగినది.

ఈ మినీ పుస్తకములో సరళంగా అర్థమయ్యేటువంటి వాస్తు పాయింట్స్‌ను అందించడము జరిగినది. వాస్తు శాస్త్రంపై బాగా అవగాహన ఏర్పడాలంటే **'శుభవాస్తు'** పుస్తకమును చదువ గలరు. ప్రముఖ పుస్తకాల షాపులలో **'శుభవాస్తు'** పుస్తకము లభ్యమగును. లభ్యం కానిచో దయచేసి నన్ను సంప్రదించండి.

మీ బంధువులకు, స్నేహితులకు శుభవాస్తు పుస్తకమును బహుమతిగా ఇవ్వదలిస్తే నా *e-mail : peegeess@yahoo.com, subhavaastu@ rediffmail.com* కు మెయిల్ పంపినచో మీరు కోరిన ప్రదేశమునకు, మీరు కోరిన వ్యక్తులకు పంపగలము.

అలాగే మిగిలిన పుస్తకములను కూడా మీరు మీ ఆత్మీయులకు మా సంస్థ నుండి పంపవచ్చును. లేదా మీకు వాస్తు పుస్తకములు కావలెనన్న వెబ్‌సైట్ ద్వారా కూడా ఆర్డర్ చేసి పుస్తకములను అందుకోవచ్చును.

ముఖ్యంగా విదేశాలలో నివసిస్తున్న మన భారతీయుల కోసం *e-book* ను తయారుచేయడమైనది. అన్ని భారతీయ భాషలలో *e-book* వచ్చులాగున ప్రయత్నాలు చేస్తున్నాము. ఈ *e-book* ను ప్రత్యేకముగా మీ కోసం ఉచితముగా అందివ్వడం జరుగుతున్నది. దయచేసి మీరు ఈ అవకాశమును సద్వినియోగము చేసుకొని అలాగే మన *www.subhavaastu.com* ను మీ బంధువులు, స్నేహితులు సందర్శించమని తెలుపుతారని ఆశిస్తాను.


భవదీయ

**సురేష్ సిద్ధాంతి**

సెల్ :- 98481 14778

ఇతర రాష్ట్రాల నుండి :- 0 98481 14778.

ఇతర దేశాల నుండి :- 00 91 98481 14778.

# దిక్కులు - మూలలు - బరువులు

సర్వేజనా సుఖినోభవంతు. మీకంతా శుభమే జరగాలని ముందుగా కోరుకుంటూ వాస్తు శాస్త్రంలోనికి ప్రయాణం మొదలు పెడదాము. మొదటిగా దిక్కులను తెలుసు కుందాము. ఉదయిస్తున్న సూర్యుడిని చూస్తాము కదా. మనము చూస్తున్న ఆ దిక్కు తూర్పు దిక్కు, మన వెనుక ఉన్నది పశ్చిమ దిక్కు, మన ఎడమచేతి ప్రక్క ఉత్తర దిక్కు, మన కుడి చేతి ప్రక్క దక్షిణ దిక్కుగా తెలుసుకోవాలి.






ఈ పటమును గమనిస్తే మీకు దిక్కులు బాగా అర్థమవుతాయి. ఇక మూలల గురించి తెలుసుకుందాము. ఉత్తరము మరియు తూర్పు మధ్యలో ఉన్నది ఈశాన్యము. తూర్పు మరియు దక్షిణము మధ్యలో ఉన్నది ఆగ్నేయము. దక్షిణము మరియు పశ్చిమము మధ్యలో ఉన్నది నైరుతి. పశ్చిమము మరియు ఉత్తరము మధ్యలో ఉన్నది వాయవ్యము. ఇక బరువులు గురించి తెలుసుకుందాము.

గృహములో బరువులను నైరుతి నుంచి దక్షిణము పక్కగా ఉంచుకోవాలి లేదా నైరుతి నుంచి పశ్చిమ పక్కగానైనా ఉంచుకోవాలి. ఇంకో విధానము కూడా వున్నది. గృహాన్ని నాలుగు భాగాలుగా ఊహించుకున్నప్పుడు అందులో ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి, వాయవ్య భాగాలుగా ఉండును. అందులో నైరుతి భాగములో బరువులను ఉంచుకోవడము చాలా శ్రేష్ఠమైన విధానము. ఈ పటము ద్వారా గృహము యందలి భాగాలను చూసుకొని అందు నైరుతి భాగంలో బరువులు వుంచుకోవాలి.




పై కనిపించు నైఋతి భాగములో బరువులు వుంచుకోవడం కూడా ఒక పద్ధతి.

## దిక్కులు, మూలలు - హెచ్చు, పల్లము

ముందుగా తూర్పు భాగము నుంచి మొదలు పెడదాము.

### తూర్పు :-

1. తూర్పున ఖాళీ స్థలము వుండడము మంచిది.
2. తూర్పు పల్లము కావడము శ్రేష్టము.
3. తూర్పున బావి, బోరు, గుంత వుండడము మంచిది.
4. తూర్పు భాగమున ఇంటికి ఎదురు వచ్చునట్లుగా మెట్లు వుండడము తప్పు.
5. గృహము యందలి ఫ్లోరింగ్ లెవెల్ కన్నా బయట తూర్పు భాగములో ఎక్కువ ఎత్తు వుండరాదు.

### ఆగ్నేయము :-

6. ఈశాన్యము కన్నను ఆగ్నేయము ఎత్తుగా వుండడము శ్రేష్టము.
7. వాయవ్యము, ఆగ్నేయము ఫ్లోరింగ్ లెవెల్లు సమముగా వుండాలి.
8. నైరుతి భూమి మట్టం కన్నా ఆగ్నేయ భూమి మట్టము హెచ్చు ఉండరాదు.
9. ఆగ్నేయము పల్లముగా ఉండడము దోషము.

### దక్షిణము :-

10. దక్షిణ భాగములో ఎత్తైన మాడీలు, గుట్టలు, కొండలు, సెల్‌ఫోన్ టవర్లు, అపార్ట్‌మెంట్లు వుండడము చాలా మంచిది.
11. దక్షిణము పల్లము కారాదు. అనారోగ్యాలు, ధన నష్టం, అప్పులు.
12. దక్షిణనమున బావి, గుంతలు, సరస్సులు, కొలనులు ఇతరత్రా వుండడము తప్పు. అలా వున్నచో వెంటనే నివారణా పద్ధతులు పాటించాలి.

### నైరుతి :-

13. నైరుతిలో కొండలు కానీ, గుట్టలు కానీ, సెల్‌ఫోన్ టవర్లు కానీ, భారీ నిర్మాణాలు కానీ, ఎత్తైన మాడీలు కానీ, ఉప గృహాలు కానీ ఉండడము శ్రేష్ఠము.
14. నైఋతి ఎత్తుగా ఉంటే శుభము. బరువుగా ఉంటే బలము.
15. నైరుతిలో బలమైన రాతి అరుగు నిర్మాణాలు, అరుగులు ఉండడము మేలు.
16. నైరుతి భాగములో గుంతలు, కాలువలు, కొలనులు, బావి ఇతరములైనవి వుండరాదు. మరణాలు, రోగాలు, నష్టాలు, కష్టాలు.

**పశ్చిమము :-**

17. పశ్చిమ భాగము బాగా ఎత్తు కలిగి నిర్మించబడి వుండాలి. గుట్టలు, మిట్టలు, రాళ్లు, రప్పలు, సెల్‌ఫోన్ టవర్లు, భారీ భవంతులు, కొండలు, ఇతరాత్ర వుండడము శుభము.
18. బలమైన రాళ్లతో నిర్మించిన అరుగులు వుండడము క్షేమము.
19. పశ్చిమ భాగము పల్లముగా వుండరాదు. అనారోగ్యం, అభద్రత.
20. పశ్చిమ భాగములో కాలువలు, నూతులు, బావులు, బోరు, గుంతలు, ఇతరత్రా వుండరాదు. పక్షవాతం, అనారోగ్యం, ఒక్కోసారి మరణం, అభద్రత.

**వాయువ్యము :-**

21. నైరుతి కన్ననూ వాయవ్యము పల్లముగా వుండాలి. అయితే ఈశాన్యము కన్ననూ పల్లముగా వుండరాదు. ఆగ్నేయంతో సమానంగా ఉండాలి.
22. వాయవ్యములో ఎత్తైన అరుగులు, మాడీ నిర్మాణాలు ఇతరత్రా వుండరాదు.
23. వాయవ్యము ఈశాన్యము కన్ననూ పల్లమై వుండరాదు.

**ఉత్తరము :-**

24. ఉత్తరములో కొండ, గుట్ట, ఎత్తైన మాడీలు, బలమైన రాతి అరుగులు ఇతరత్ర వుండరాదు.
25. ఉత్తరము ఎప్పటికీ పల్లముగా ఉండాలి. ధనాదాయము, సంతోషము.
26. ఉత్తర భాగము గుంతలు వుండడము మంచిది.

**ఈశాన్యము :-**

27. ఈశాన్య భాగములో ఏనాటికీ ఎత్తైన నిర్మాణాలు చేయవద్దు.
28. ఈశాన్యము హెచ్చు (మిద్రు) కలిగి వుండడము తప్పు. ఎత్తైన మాడీలు, బరువులు, రాతి నిర్మాణాలు, సెల్ ఫోన్ టవర్లు ఇతరత్రా వుండడము దరిద్రము.
29. ఈశాన్యము ఎప్పటికీ పల్లమై వుండాలి. అభివృద్ధి, అదృష్టం. దీనిని పాటించడం వల్ల భవిష్యత్తులో ఎన్నో శుభములు జరుగును.

## ద్వారాలు {Doors}

30. వాస్తు శాస్త్రంలో అత్యంత ప్రముఖ్యమైన విషయాలలో ఒకటిగా ద్వారాలను చెప్పుకోవాలి. ద్వారము (తలుపులు) సరైన స్థలములో వుంటే ఫలితాలు చాలా బాగుంటాయి. ద్వారములను ఉచ్ఛస్థానములో ఏర్పాటు చేసుకోవాలి.
31. ద్వార నిర్ణయం విషయంలో పొరపాటు చేసినచో అనేక విధాలైనటువంటి కష్టాలను ఎదుర్కోవలసి వుంటుంది. దీనికి విరుగుడు, ద్వారాన్ని సరైన స్థానములో పెట్టడము మాత్రమే. దీనికి వేరొక ఉపాయము ఉన్ననూ అది విపరీతమైన ఖర్చుతో కూడుకున్నది.

32. ద్వారముల విషయంలో రారాజులాంటి ద్వారము మొదటిగా తూర్పు ఈశాన్య ద్వారము. రెండవది ఉత్తర ఈశాన్య ద్వారము.

33. ఉత్తర ఈశాన్య ద్వారము, దక్షిణ ఆగ్నేయ ద్వారము, పశ్చిమ వాయవ్య ద్వారము చాలా మంచి ఫలితాలు ఇచ్చునటువంటి ద్వారములు.

34. తూర్పు ద్వారము, దక్షిణ ద్వారము, పశ్చిమ ద్వారము, ఉత్తర ద్వారము ఇవన్నియూ దోషములు లేకుండా ఏర్పాటు చేసుకున్నచో సత్ఫలితాల ద్వారములగును.

35. తూర్పు ఆగ్నేయము, ఆగ్నేయము, దక్షిణ నైరుతి, నైరుతి, పశ్చిమ నైరుతి, వాయవ్యము, ఉత్తర వాయవ్యము, ఈ ప్రదేశాల్లో ఉన్న ద్వారములన్నియూ నీచ ద్వారములు. మీ గృహము నందు ఈ ప్రాంతాలలో ద్వారములు ఉన్నచో వెంటనే మార్పు చేసుకోవడము మంచిది. దయచేసి ఆలస్యం చేయవద్దు.

36. ద్వారముల విషయంలో ఇంత అని సంఖ్య లేదు. 3, 7, 10, 11, 12, 13 ద్వారములు ఉండడము తప్పు కాదు. ఎన్ని ద్వారములున్ననూ ఉచ్ఛమైన ప్రదేశాలలో మాత్రమే ద్వారములు ఏర్పాటు చేసుకోవలెను. అనగా తూర్పు ఈశాన్యము, దక్షిణాగ్నేయము, పశ్చిమ వాయవ్యము, ఉత్తర ఈశాన్యములలో ఏర్పాటు చేసుకోవాలి.

37. ద్వారములకు వాస్తు శాస్త్రంలో ప్రత్యేకమైన స్థానము కలదని మరవరాదు. మనిషి జీవితాన్ని మార్చు శక్తి ఈ ద్వారములకు కలదు. గమనించాలి.

38. తూర్పు వీధి గృహాల వారు ద్వారములు తూర్పు ఈశాన్యములో వుంచుకోవడము శ్రేష్టము.

* దక్షిణ వీధి గృహాల వారు ద్వారమును దక్షిణ ఆగ్నేయములో ఏర్పాటు చేసుకోవడము మంచిది.
* పశ్చిమ వీధి గృహముల వారు ద్వారములు పశ్చిమ వాయవ్యమున ఏర్పాటు చేసుకోవడము మంచిది.
* ఉత్తర వీధి గృహముల వారు ద్వారమును ఉత్తర ఈశాన్యమున ఏర్పాటు చేసుకోవడము మంచిది.

ఒకవేళ ఈ పద్ధతిలో ఏర్పాటు చేసుకోవడానికి మీకు అనుకూలం లేకపోయినచో మరొక ప్రాంతము అనగా తూర్పు వీధి గృహం వారు తూర్పు యందు, దక్షిణ వీధి గృహము వారు దక్షిణము యందు, పశ్చిమ వీధి గృహము వారు పశ్చిమము యందు, ఉత్తర వీధి గృహము వారు ఉత్తరము యందు ద్వారములను ఏర్పాటు చేసుకోవాలి.

మన కుటుంబం మనది. ఎంత కష్టపడిననూ ఫలితము లేనిచో అనుభవించు బాధను ఇతరులకు చెప్పుకోలేము. లోలోపల కుమిలిపోవలసి వుంటుంది. ఎంతో కష్టపడి ధన సంపాదన చేసి కుటుంబ పోషణకు, కుటుంబ సభ్యుల కష్టాలలో ఆదుకొని, తరువాత తీరికగా వారు అను మాటలను పడవలసి వుంటుంది. అదే ముందుగానే జాగ్రత్త తీసుకొని కుటుంబంలో కష్టములు లేకుండా చూసుకున్నచో బుద్ధిమంతులము కాగలము కదా. ఈ విషయంలో వాస్తుశాస్త్రము మీకు అమోఘంగా సహాయం చేయగలదు. ఇంతవరకు వాస్తు శాస్త్రమును నమ్మి పాటించి చెడినవారు లేరు. అయితే ఇక్కడ మీకు ఒక విషయం స్ఫురణకు రావచ్చును. ఒకటి, రెండు సంఘటనలు వాస్తు పాటించి చెడినవి గమనించివుండవచ్చును. మిడిమిడి జ్ఞానం గల వాస్తు శాస్త్రవేత్తలతో వాస్తు సలహాలను పొంది సవరణలు చేయించిన గృహముల యందు మాత్రమే మంచి ఫలితములు వచ్చి వుండవు. అంతియే గానీ అనుభవజ్ఞుడైన వాస్తుశాస్త్రవేత్త సలహాలను పొంది చెడినవారు లేనేలేరు.

మీ ఆస్థులను నాతో పరిశీలింపచేయించుకోదలిస్తే నన్ను ఇ-మెయిల్ ద్వారా కానీ లేదా సెల్‌ఫోన్ ద్వారా కానీ సంప్రదించగలరు. ముఖ్యంగా విదేశాలలో నివసిస్తున్న భారతీయ సంతతికి ఇదొక ఊహించని అవకాశం. ఇక సద్వినియోగం చేసుకోవడం మీ చేతుల్లో ఉంది. వాస్తు, జ్యోతిషము కొరకు సంప్రదించగలరు.

*e-mail : peegeess@yahoo.com,* ***Web Site : www.subhavaastu.com***

– **సురేష్ సిద్ధాంతి. ఫోన్ : 98481 14778**

## ప్రహరీ గోడ

39. గృహము ముందా? ప్రహరీ ముందా? అనే విషయము చర్చకు వచ్చినా, రాకపోయినా ముందుగా ప్రహరీనే నిర్మించుకోవాలి.
40. ప్రహరీ గోడ విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకున్నచో పరిసర వాస్తులో ఏమైనా దోషములు ఉన్ననూ ఈ ప్రహరీ గోడకు వాటిని అడ్డుకోగల శక్తి గలదు.
41. ప్రహరీ గోడ ఎంత బలంగా వుంటే అంత మంచి ఫలితాలు వస్తాయి.
42. దక్షిణ, పశ్చిమ ప్రహరీ గోడ తూర్పు, ఉత్తర ప్రహరీ గోడల కన్నా ఎత్తుగా వుండడం శ్రేయస్కరం.
43. గృహము వెలుపల దక్షిణ, పశ్చిమ భాగములలో గుంతలు, కాలువలు, ఇతరత్రా దోషాలు ఉన్నచో దక్షిణ, పశ్చిమ భాగములలో బలమైన రాతి నిర్మాణముతో ప్రహరీ గోడను బాగా ఎత్తుగా బలంగా నిర్మించుకున్నట్లు అయితే ఆ దోషాలను ఈ ప్రహరీ గోడ ఆపుతుంది. అలాగే బలమైన రాతి అరుగులను దక్షిణ, పశ్చిమ భాగములయందు నిర్మించుకోవడం ద్వారా కూడా శత్రునాశనం జరిగి, అన్నింటా విజయం ప్రాప్తించి మనసును ఉల్లాసంగా ఉంచును.
44. ప్రహరీ గోడ సక్రమమైన విధానంలో ఏర్పాటు చేసుకున్నప్పుడు దాదాపుగా చెడు దుష్ఫలితాలు, చెడు వీధిపోటు ఫలితాన్ని కూడా ఆపు శక్తిని కలిగి వుంటుంది. అయితే ప్రహరీ గోడ బలంగా నిర్మించుకోవడం చేయాలి.
45. ప్రహరీ గోడ ఏ ప్రాంతంలోనైననూ కూలి పోయినచో ఆలస్యం చేయక వెంటనే తిరిగి కట్టుకోవాలి.
46. ఒకవేళ నైరుతి భాగంలో ప్రహరీ గోడ కూలినచో అన్ని పనులను పక్కన పెట్టి యుద్ధ ప్రాతిపదికన ప్రహరీ గోడను నిర్మించుకోవాలి. ఈ విషయంలో ఆలస్యం చేయడమనగా కొరివితో తలకాయను గోక్కున్నట్లే, ఈతరాని వాడు నదిలోకి దుమికినట్లే.
47. కనీసం సంవత్సరానికి ఒకసారి ప్రహరీ గోడకు మరమ్మత్తులు చేయించు కోవడము చాలా తెలివైన నిర్ణయము. నైరుతిలో ప్రహరీ గోడ కూలినచో ఆ విషయాన్ని ఆషామాషీగా, సాధారణంగా తీసుకోవడము తప్పు చేసినట్లు అవుతుంది. దీనికున్న ప్రాశస్త్యం వల్ల పదే పదే ఈ విషయాన్ని వివరించాము.

### ప్రహరీ గేట్లు :

48. ద్వారములు వాస్తులో ఎంత ప్రముఖమైన స్థానమును ఆక్రమిస్తాయో ప్రహరీ అంత ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది. ద్వారములు ముఖ్యము కదా అని ద్వారములు మాత్రము సరైన స్థానంలో వుంచుకొని ప్రహరీ గేట్ల విషయంలో పొరపాటు చేయడము తగదు. అత్యంత జాగురూకతతో ఉండడము క్షేమము.
49. తూర్పు ముఖ ద్వారము గల గృహస్థులు ప్రహరీలో గేటును తూర్పు ఈశాన్యములో ఏర్పాటు చేసుకోవాలి.
50. దక్షిణ ముఖ ద్వారము గల గృహస్థులు ప్రహరీలో గేటును దక్షిణ ఆగ్నేయములో ఏర్పాటు చేసుకోవలెను.
51. పశ్చిమ ముఖ ద్వారము గల గృహస్థులు ప్రహరీలో గేటును పశ్చిమ వాయవ్యములో ఏర్పాటు చేసుకోవాలి.
52. ఉత్తర ముఖ ద్వారము గల గృహస్థులు ప్రహరీలో గేటును ఉత్తర ఈశాన్యములో ఏర్పాటు చేసుకోవాలి.
53. ప్రహరీ కన్ననూ ప్రహరీ గేటును ఎత్తు పెంచుకోవలసిన అవసరము లేదు.
54. ప్రహరీ గోడ మందమునకు మధ్యలో గేటును ఏర్పాటు చేసుకోవాలి.

55. తూర్పు వీధి గృహస్థులు ప్రహారీ తూర్పు ఈశాన్యములో ప్రహారీ గేటును ఏర్పాటు చేసుకోవచ్చు. గృహ ముఖ ద్వారమునకు ఎదురుగా ప్రహారీలో రెండవ గేటు రాక పోయిననూ ప్రమాదము లేదు.

56. దక్షిణ వీధి గృహస్థులు దక్షిణ ఆగ్నేయ ప్రహారీలో గేటును ఏర్పాటు చేసుకొని గృహ ముఖ ద్వారానికి ఎదురుగా ప్రహారీకి గేటును ఉంచరు. ఇది తప్పు. గృహము ముఖ ద్వారమునకు ఎదురుగా ప్రహారీలో రెండవ గేటు రావలెను. ప్రహారీ దక్షిణ ఆగ్నేయములో కూడా గేటు వుండవలెను. ఈ విషయంలో అనుభవజ్ఞుల సలహా ముఖ్యము. పూర్తి వివరాలకు "శుభవాస్తు" పుస్తకమును గమనించగలరు. అనుభవజ్ఞుల సలహాలేనిదే ఈ విషయంలో స్వంత నిర్ణయం తీసుకోకూడదు.

57. పశ్చిమ వీధి గృహస్థులు పశ్చిమ వాయవ్య ప్రహారీలో గేటును ఏర్పాటు చేసుకొని గృహ ముఖ ద్వారానికి ఎదురుగా ప్రహారీకి గేటును ఉంచరు. ఇది సరికాదు. గృహము ముఖ ద్వారమునకు ఎదురుగా ప్రహారీలో రెండవ గేటు రావలెను. ప్రహారీ పశ్చిమ వావయ్యములో కూడా గేటు వుండవలెను. అనుభవజ్ఞుల సలహా మరీ మరీ ముఖ్యమైనది. శ్రద్ధగా ఆలకించండి.

58. ఉత్తర వీధి గృహస్థులు ప్రహారీ ఉత్తర ఈశాన్యములో ప్రహారీ గేటును ఏర్పాటు చేసుకోవచ్చు. గృహ ముఖ ద్వారమునకు ఎదురుగా రెండవ గేటు రాక పోయిననూ ప్రమాదము లేదు.

## నడకలు

59. తూర్పు ఈశాన్యము నుంచి దక్షిణ ఆగ్నేయ నడక శుభము. (గృహములో)
60. తూర్పు ఈశాన్యము నుంచి దక్షిణ నడక శుభము. (గృహములో)
61. తూర్పు ఈశాన్యము నుంచి పశ్చిమ నడక శుభము.
62. తూర్పు ఈశాన్యము నుంచి పశ్చిమ వాయవ్య నడక శుభకరము.
63. తూర్పు ఈశాన్యము నుంచి ఉత్తర నడక శుభము.
64. తూర్పు ఈశాన్యము నుంచి ఉత్తర ఈశాన్య నడక శుభము.
65. తూర్పు నుంచి దక్షిణ ఆగ్నేయ నడక శుభము.
66. తూర్పు నుంచి దక్షిణ నడక శుభము.
67. తూర్పు నుంచి పశ్చిమ నడక శుభము.
68. తూర్పు ఈశాన్యము నుంచి పశ్చిమ నడక శుభము.
69. తూర్పు నుంచి ఉత్తర నడక శుభము.
70. తూర్పు నుంచి ఉత్తర ఈశాన్య నడక శుభము.
71. తూర్పు ఈశాన్యము నుంచి పశ్చిమ నడక శుభము.
72. దక్షిణ ఆగ్నేయము నుంచి ఉత్తర ఈశాన్య నడక శుభకరము.
73. దక్షిణము నుంచి ఉత్తరము నడక శుభము.
74. దక్షిణము నుంచి ఉత్తర ఈశాన్య నడక శుభము.
75. పశ్చిమము నుంచి ఉత్తరము నడక శుభము.



*e-mail : peegeess@yahoo.com,* ***Web Site : www.subhavaastu.com***

**రచయిత : సురేష్ సిద్ధాంతి. ఫోన్ : 98481 14778**

76. పశ్చిమము నుంచి ఉత్తర ఈశాన్య నడక శుభము.
77. పశ్చిమ వాయవ్యము నుంచి ఉత్తర నడక శుభము.
78. పశ్చిమ వాయవ్యము నుంచి ఉత్తర ఈశాన్య నడక శుభము.

దక్షిణము, పశ్చిమము, ఉత్తరము నుంచి తూర్పుకు నడకలు చెప్పలేదు కారణం తూర్పు నడకలలో ఇవన్నియూ వచ్చాయి. తూర్పు నుంచి దక్షిణమునకు, దక్షిణము నుంచి తూర్పుకు ఎలా అనుకున్నా ఒకటే కదా.

## కిటికీలు

వాస్తు శాస్త్రంలో కిటికీలకు కూడా కొన్ని ప్రదేశములు కలవు. కొన్ని ప్రాంతాలలో కిటికీలు ఏర్పాటు చేసుకోకపోవడమే మంచిది. ప్రస్తుతము వాటి గురించి తెలుసు కుందాము.

79. గృహములో నైరుతి గదిలో నైరుతి యందు కిటికీలను ఏర్పాటు చేయరాదు.
80. ఒకవేళ తప్పనిసరి పరిస్థితుల్లో ఆ ప్రాంతములో కిటికీలు వచ్చినప్పుడు గృహము ఈశాన్యము గదిలో ఈశాన్యము యందు కూడానూ కిటికీలు రావలెను. అదియునూ పెద్ద కిటికీలు రావడం శ్రేయస్కరము.
81. మంచి ఫలితాల కొరకు గృహము యొక్క ఉత్తర, ఈశాన్య, తూర్పు గదులలో ఎన్ని వీలైతే అన్ని పెద్ద కిటికీలను ఏర్పాటు చేసుకోవడము మంచిది. కిటికీలకు ఇన్నే పెట్టుకోవాలని సంఖ్యే లేదు. ఇటువంటి విషయాల గురించి ఆలోచన చేసి అనవసరంగా సమయాన్ని వ్యర్థము చేసుకోవద్దు.
82. పశ్చిమ, దక్షిణ గదులలో చిన్న కిటికీలను ఏర్పాటు చేసుకోవడము ఉత్తమము.
83. వాయవ్య గదిలో పశ్చిమ వాయవ్యములో కిటికీ రావడము చాలా మంచిది.
84. గృహము ఆగ్నేయము గదిలో దక్షిణ ఆగ్నేయములో కిటికీ రావడము మంచిది.
85. నైరుతి గదిలో పశ్చిమ వాయవ్యంలోనూ లేదా దక్షిణ ఆగ్నేయములోను కిటికీలను ఏర్పాటు చేసుకోవచ్చు. అవసరమనుకుంటే రెండు ఉంచుకోండి. అయితే రెండు కిటికీలు ఏర్పాటు చేసుకున్నప్పుడు చిన్న కిటికీలను ఏర్పాటు చేసుకోవడము మంచిది.
86. మరొకసారి గుర్తించుకోండి ఉత్తర ఈశాన్య, తూర్పు గదులలో పెద్ద కిటికీలను పశ్చిమ, దక్షిణ, నైరుతి గదులలో చిన్న కిటికీలను ఏర్పాటు చేసుకోవలెను.

## వీధులు

వీధులు అనగానే మనకు ఒక విషయము గుర్తుకు రావాలి. మన గృహమును దాటి బయట ప్రాంతం గురించి తెలుసుకుంటున్నాము అనే విషయము స్ఫురణకు వస్తుంది. బయట ప్రాంతము అనగా పరిసర వాస్తు అనే విషయము గమనించాలి. పరిసర వాస్తు అనగా **'విధి'** చేతిలోని శక్తి. ఈ **'విధి'** – దీని శక్తులు గురించి **'వీధిపోట్ల'** పుస్తకములో అద్భుతంగా వ్రాశారని చదువరులు కితాబిచ్చారు. అందరికి ధన్యవాదములు. ఈ వీధులు – వీధిపోట్ల పూర్తి ఫలితాలు **'శుభవాస్తు'** పుస్తకములో మరియు **వీధిపోట్లు–ఫలితములు** పుస్తకములలో వివరంగా తెలుసుకోవచ్చును.

87. గృహము బయట వీధి గృహము యందలి భూమి మట్టము కన్ననూ ఎత్తు కానీ పల్లము కానీ ఉన్నట్లు అయితే దాని ప్రభావము గృహముపై వుంటుంది.
88. తూర్పు వీధి గృహస్థులకు వీధి (భూమి మట్టము) పల్లము ఉండాలి.
89. దక్షిణ వీధి గృహస్థులకు వీధి (భూమి మట్టము) హెచ్చుగా వుండాలి.
90. పశ్చిమ వీధి గృహస్థులకు వీధి (భూమి మట్టము) హెచ్చుగా ఉండాలి.
91. ఉత్తర వీధి గృహస్థులకు వీధి (భూమి మట్టము) పల్లముగా వుండాలి.

## వీధిపోట్లు

వీధిపోట్లు అను శీర్షిక చాలా పెద్దది. ఈ వీధిపోట్లపై 200 పేజీల పై మేరకు పుస్తకమును విడుదల చేశాము. విరివిగా అమ్మడవుతున్న ఈ పుస్తకము ప్రస్తుతము మార్కెట్‌లో లభ్యమవుతున్నది. ఇందులో అనేక విషయాలు వివరించడము జరిగినది. దక్షిణ, పశ్చిమ వీధిపోట్ల పూర్తి వివరముల గురించి **'వీధిపోట్లు-ఫలితములు'** పుస్తకమును చదవండి. ముందుగా శుభకరమైన వీధిపోట్లు :-

92. ఈశాన్య వీధిపోటు చాలా శుభకరమైనది. అభివృద్ధి. దీని గురించి పూర్తిగా తెలుసుకోదలిస్తే **'వీధిపోట్లు-ఫలితములు'** పుస్తకమును తెప్పించుకోగలరు.
93. తూర్పు ఈశాన్య వీధిపోటు చాలా మంచిది. కీర్తి ప్రతిష్టలు.
94. తూర్పు వీధిపోటు మంచిది. పూర్తి వివరాలకు వీధిపోట్ల పుస్తకము చూడండి.
95. దక్షిణ ఆగ్నేయ వీధిపోటు శుభకరమైనది. ధన సంపాదన, జనాకర్షణ.
96. దక్షిణ వీధిపోటు మంచిది. భోగభాగ్యాలు, ధనాధాయము.
97. పశ్చిమ వీధిపోటు మంచిది. పెద్దరికము, పలుకుబడి, కీర్తి.
98. పశ్చిమ వాయవ్య వీధిపోటు శుభకరమైనది. వ్యవహార విజయము, ధనం.
99. ఉత్తర వీధిపోటు మంచిది. ధనాధాయము, వ్యాపార అభివృద్ధి.
100. ఉత్తర ఈశాన్య వీధిపోటు శుభకరమైనది. డబ్బు, సంతోషము.

<u>ఇప్పుడు చెడు వీధిపోట్ల గురించి తెలుసుకుందాము :-</u>

101. తూర్పు ఆగ్నేయ వీధిపోటు చాలా చెడ్డది. నష్టము, ఘోరము, అఘాయిత్యాలు.
102. ఆగ్నేయ వీధిపోటు మహా దోషపూరితమైనది. కొట్లాటలు, జైలు, నష్టము.
103. దక్షిణ నైరుతి వీధిపోటు అసలుకే మోసం చేయును. రోగాలు, స్త్రీ బాధ.
104. నైరుతి వీధిపోటు ముండ మోయించును. భయంకర రోగాలు, అభద్రత, మరణాలు.
105. పశ్చిమ నైరుతి వీధిపోటు పరలోక ప్రయాణము. రోగాలు, దరిద్రము.
106. వాయవ్య వీధిపోటు ఈ వాసనే వద్దు. వ్యాపార నష్టము, పతనము.
107. ఉత్తర వాయవ్య వీధిపోటు, దరిద్రము పట్టుకుంటే వదలదు. అప్పులు.

## మూలలు - మూతలు

గృహములో ప్రహరీ యందు ఏదైనా ఒక మూల మూత పడి వుండడమును మూల మూత పడడము అంటారు.

108. మూలలు నాలుగు : ఈశాన్య మూల, ఆగ్నేయ మూల, నైరుతి మూల, వాయవ్య మూల.
109. నైరుతి మూల మూత పడటము విశేష ఫలితాలు ఇచ్చును.
110. వాయవ్య మూల మూత కష్టాలకు గురి చేయును.
111. ఆగ్నేయ మూల మూత బాధా కరము.
112. ఈశాన్య మూల మూత అసలుకే మోసము.
113. నైరుతిలో వేయు మూల మూత లోపలి భూమి మట్టమును గృహము యందలి ఫ్లోరింగ్ లెవెల్ కన్ననూ ఎత్తు వుండడము చాలా శ్రేయస్కరము. అన్నింటా శుభము.
114. ఈశాన్య మూలలో మూత మహాదోష పూరితమైనది. ఈ విధంగా మీ ప్రహరీలో ఈశాన్య మూల మూత వుంటే క్షణం ఆలస్యం చేయక వెంటనే తొలగించు కోవాలి.

## కొన్ని ముఖ్య విషయాలు

గృహస్థులు అభివృద్ధిలోకి రావలెనన్న వాస్తు శాస్త్ర సహాయాన్ని పూర్తిగా సద్వినియోగం చేసుకోవడము శ్రేష్టము. ఇది చిన్న పుస్తకము కావున పూర్తి విషయాలు తెలపడానికి సాధ్యం కాదు. ఇప్పుడు మనము కొన్ని ముఖ్యమైన విషయాలను తెలుసుకుందాము. మీకు వాస్తు శాస్త్రవేత్త అందుబాటులో లేకపోతే ఈ క్రింది సూచనలు పాటించడము మంచిదని భావించి తెలపడమైనది. ముందుగా గృహము కొను వారికి కొన్ని సూచనలు.

115. కొను స్థలమునకు ఈశాన్యము కోత పడరాదు.
116. దక్షిణ, నైఋతి, పశ్చిమముల యందు కాలువలు, సరస్సులు, గుంతలున్న స్థలములను కొనరాదు.
117. తూర్పు మరియు ఉత్తరములు కోత పడిన స్థలములు మంచివి కాదు.
118. తూర్పు ఆగ్నేయము పెరిగిన స్థలము అశుభకరము.
119. దక్షిణ, పశ్చిమ, నైఋతిలు పెరిగిన స్థలము దరిద్రము.
120. తూర్పు, ఉత్తర, ఈశాన్యములు ఎత్తుగా ఉండి (మెరక) దక్షిణ, పశ్చిమ, నైఋతిలకు వెళ్ళు కొద్దీ పల్లమైనచో అవి చండాల స్థలములు.
121. ఉత్తర వాయువ్యము పెరిగిన స్థలము దోష పూరితము.
122. తూర్పు ఆగ్నేయ, దక్షిణ నైఋతి, పశ్చిమ నైఋతి, ఉత్తర వాయువ్య వీధి పోట్లు ఉన్న స్థలములను కొనరాదు.
123. సాధ్యమైనంత వరకు ఆగ్నేయ బ్లాక్ స్థలమును కొనకపోవడమే చాలా మంచిది.
124. తూర్పు, ఈశాన్య, ఉత్తరముల యందు బహుళ అంతస్థులు యుండి, దక్షిణ, పశ్చిమ, నైఋతిల యందు ఆటస్థలములు, మైదానములు ఉన్న స్థలములను కొనరాదు.

ఇప్పుడు మనము స్థలము లేదా గృహము కొన్న తర్వాత చేయవలసిన కొన్ని కార్యక్రమములు మరియు సవరణలను తెలుసుకుందాము.

125. ముందుగా స్థలశుద్ధి గావించవలెను.

126. ఈశాన్యములో గుంతలున్నచో వాటిని పూడ్చరాదు.
127. ఈశాన్యములో బావి ఉన్నచో అదృష్టవంతులే. శుభకరము.శ్రేష్ఠము.
128. ఈశాన్యములో మెట్లు ఉన్నచో వెంటనే కొట్టి వేయండి.
129. ఈశాన్యములో మూత గదులు ఉంటే ఒక్క క్షణం ఆలస్యం చేయక కొట్టివేయండి.
130. ఈశాన్యమును పల్లము చేసుకోండి.
131. ఈశాన్యములో బోరు వేసుకోవడం చాలా మంచిది.
132. కొళాయి (నల్లా) గుంతను ఈశాన్యములో ఉంచుకోవడం శ్రేష్ఠం.
133. ఈశాన్యములో నడక వచ్చు లాగున గేటును ఏర్పాటు చేసుకోండి.
134. గృహమునకు ఈశాన్యములో ద్వారములు ఉంచుకోండి.
135. గృహము యందు ప్రతి గదికి ఉచ్చస్థానములో ద్వారములు ఏర్పాటు చేసుకోండి.
136. ముఖ్య ద్వారమునకు ప్రహారీ గేటు దిమ్మె పోటు తగలకుండా జాగ్రత్త పడండి.
137. గృహముయందు కూడా ఈశాన్యం గది పల్లము కావడం శుభం.
138. ఈశాన్యం గదిలో ఎక్కువ కిటికీలు ఉండులాగున చూసుకోవాలి.
139. ఈశాన్యం గదికి ఎన్ని వాకిళ్ళున్నా తప్పులేదు.
140. శ్రీ పదమని ఈశన్యం గదికి నాలుగు వాకిళ్ళు ఉంచి గృహములో వాస్తు దోషాలుంటే శుభము జరుగదు.
141. తూర్పు ఈశాన్యము, ఉత్తర ఈశాన్య ద్వారములను మూతలు వేయక, నడక ఎక్కువ ఉండులాగున జాగ్రత్తలు తీసుకోవాలి.
142. తూర్పు భాగంలో ఎక్కువ ఖాళీ స్థలము ఉంచుకోవడం చేయాలి.
143. తూర్పు పల్లం కావడం శ్రేష్ఠం.
144. తూర్పు స్థలంలో బావి ఉండడం కీడు కాదు. శుభకరము.
145. గృహము బయట తూర్పు స్థలములో మెట్లు ఇంటికి పోటు వచ్చులాగున ఏర్పాటు చేసుకోరాదు.
146. ఆగ్నేయము పెరగకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. ఆగ్నేయ ద్వారములను వెంటనే తొలగించి గోడ కట్టుకోవాలి.
147. తూర్పు ఆగ్నేయ ద్వారము కూడా తొలగించుకొని గోడ పూరించాలి.
148. ఆగ్నేయములో ద్వారమును తొలగించుకోవచ్చు. ఆగ్నేయ మూల మూతపడరాదు.
149. దక్షిణ ఆగ్నేయములో ద్వారముండడం ఏమాత్రము తప్పు కాదు. అయితే పశ్చిమ వాయువ్యములో, దక్షిణ ఆగ్నేయములో రెండు ద్వారములు ఉండడం మంచిది కాదు. ఇలా ఉంటే ఏదో ఒక ద్వారమును మాత్రమే వాడుకోవాలి.
150. దక్షిణమున గుంతలను వెంటనే పూడ్చివేయాలి.
151. దక్షిణములో భూమి మట్టము ఇంటి ఫ్లోరింగ్‌కన్నా ఎత్తుగా ఉండటం శుభం.
152. దక్షిణ ప్రహారీ బలంగా, ఉత్తర ప్రహారీకన్నా ఎత్తుగా ఉండాలి.
153. దక్షిణములో ఉన్న వృక్షములను కొట్టరాదు.
154. దక్షిణ భాగము ద్వారా వాడుక నీరు బయటకు వెళ్ళరాదు.
155. దక్షిణములో వాలు వరండాలు వేసుకోరాదు.
156. దక్షిణములో బలమైన రాతి అరుగులు నిర్మించడం చాలా మంచిది.

157. నైఋతిలో ఉపగృహము వేసుకోవడం ప్రశస్థము.
158. నైఋతిలో ఉన్న అరుగులను కొట్టరాదు.
159. నైఋతిలో ఉన్న వృక్షాలను ఎటువంటి పరిస్థితుల లోను కొట్టివేయరాదు.
160. నైఋతిలో గుంతలున్నచో తక్షణమే పూడ్చివేయండి.
161. నైఋతిలో ప్రహారీ దెబ్బతిని ఉంటే ఒక్క క్షణం ఆలస్యం చేయక పునర్మించుకోండి.
162. నైఋతి ద్వారా వాడక నీరు బయటకు వెళ్ళరాదు.
163. నైఋతి ప్రహారీ గోడకు గూళ్ళు ఉండరాదు.
164. పశ్చిమము పల్లముగా ఉండరాదు.
165. పశ్చిమ ప్రహారీ గోడకు ఆనుకొని నిరభ్యంతరముగా రాతి అరుగుల నిర్మాణము కావించవచ్చు.
166. పశ్చిమ ప్రహారీకి ఆనుకొని షెడ్ ఉన్న తప్పులేదు. అయితే కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.
167. పశ్చిమము యందు ఎక్కువ ఖాళీ స్థలము ఉండరాదు.
168. పశ్చిమము ద్వారా వాడుకనీరు బయటకు వెళ్ళరాదు.
169. పశ్చిమములో మహావృక్షాలను పెంచుకోవడం శ్రేష్టము.
170. పశ్చిమములో ఫ్లోరింగ్, గృహము యందలి ఫ్లోరింగ్ కన్నా ఎత్తుగా ఉండడం అత్యంత శుభదాయకము.
171. పశ్చిమ ప్రహారీ గోడకు అత్యవసరమనుకుంటే తప్ప గూళ్ళు ఉంచరాదు.
172. గృహమునకు పశ్చిమ వాయవ్య మందు కిటికీ ఉండడం శ్రేష్ఠము.
173. వాయువ్యము మూల మూత గృహములు ఉండరాదు.
174. ఉత్తర వాయువ్యము పెరగడం మహా దోషము. ఉత్తర వాయువ్య నడక చండాలమైనది.
175. ఉత్తర వాయువ్యములో గుంతలు ఉండరాదు.
176. ఉత్తరము కోత పడరాదు.
177. ఉత్తర ద్వారము మంచిది.
178. ఉత్తరములో ఎక్కువ ఖాళీ స్థలము ఉండాలి.
179. ఉత్తరము పల్లమై ఉండాలి.
180. వాడుకనీరు ఉత్తరము ద్వారా నిరభ్యంతరముగా బయటకు వెళ్ళవచ్చు.
181. ఉత్తరములో లెట్రిన్ గుంతలు, ఇంకుడు గుంతలు, వేసుకోవచ్చు.
182. గోబర్ గ్యాస్ ప్లాంట్లు తగు మాత్రం జాగ్రత్తలు తీసుకొని నిరభ్యంతరంగా ఉత్తరంలో వేసుకోవచ్చు.
183. ఉత్తర ప్రహారీ గోడకు ఎన్ని గూళ్ళు ఉన్నా తొందర లేదు.
184. ఉత్తర ఈశాన్య నడకలు శుభప్రదము.
185. ఈశాన్య భాగములో దిబ్బలు వుంటే వెంటనే తొలగించండి.
186. ఈశాన్య భాగములో రాళ్లు, పాత సామాన్లు వుంటే వెంటనే శుభ్రం చేసుకోండి.

187. ఈశాన్య వీధిపోటు గల గృహము అమ్మకమునకు వచ్చినచో అప్పు చేసి కొన్నా తప్పు లేదు.
188. తూర్పు ఈశాన్య వీధిపోటు ఉన్న గృహము అమ్మకమునకు వచ్చినచో అనుమానం లేక కొనవచ్చును.
189. పొరపాటుగా కూడా తూర్పు ఆగ్నేయ వీధిపోటు గల గృహములో బాడుగకు కూడా వుండవద్దు.
190. తక్కువ ధరకు లభిస్తుంది కదా అని తూర్పు ఆగ్నేయ వీధిపోటు గల గృహమును ఎటువంటి పరిస్థితిలోనూ కొనవద్దు.
191. చెడు వీధిపోట్లు గల గృహాలలో బాడుగకు వున్ననూ దాని చెడు ఫలితము పూర్తిగా అనుభవించవలసిందే.
192. ఈశాన్యము పల్లము గల గృహములో బాడుగకు చిక్కిననూ చేరవచ్చును.
193. నైరుతి పెంపు కలిగిన గృహాలలో బాడుగకు ఉండవద్దు.
194. వాయవ్య దోషాలు గల గృహము యందు బాడుగకు చేరరాదు.
195. ఆగ్నేయ దోషాలు గల గృహము యందు కూడా బాడుగకు వుండరాదు.
196. విదిక్కు స్థలాల గృహములయందు బాడుగకు చేరవలెనన్నా అనుభవజ్ఞుల మాటలను, సూచలను పొంది నిర్ణయము తీసుకోవలెను.
197. ఈశాన్యము త్రెంపు లేకుండా తూర్పు ఈశాన్యము వాలు వరండా వేసుకోవడము చాలా మంచిది. కీర్తి ప్రతిష్టలు, ఆరోగ్యము, ఆధాయము, ఆనందం.
198. ఈశాన్యము త్రెంపు లేకుండా ఉత్తర ఈశాన్యములో వాలు వరండాను వేసుకోవాలి. ధనాధాయము, ఆరోగ్యము, సౌకర్యాలు, సంతోషము.

## కష్టే ఫలి

"కష్టే ఫలి" సువర్ణ అక్షరాలతో లిఖించాల్సిన పదమిది. నాకిష్టమైన పదము. ఎవరైతే కష్టము చేస్తారో, ఎవరైతే కష్టపడి సంపాదిస్తారో, ఎవరైతే కష్టపడి కుటుంబాన్ని పోషిస్తారో, వారు నా సోదరులు, సోదరీమణులు, నా ఆప్త మిత్రులు.

1992వ సంవత్సరము జనవరిలో వాస్తు చూడడం మొదలు పెట్టాను. కలకత్తా, ఈశాన్య రాష్ట్రాలు, కాశ్మీరు తప్ప భారతదేశంలో ప్రతి రాష్ట్రాన్ని సందర్శించాను. ఎక్కువగా కర్ణాటక, కేరళ, తమిళనాడు, ఆంధ్ర, మహారాష్ట్ర, రాజస్థాన్, హర్యానా, ఒరిస్సాలకు వెళుతుంటాను. మిగిలిన రాష్ట్రాలకు సంవత్సరములో ఒకటి రెండు సార్లు వెళుతుంటాను. ఎందరో కస్టమర్స్ వాస్తు చూడడానికి పిలవడము, నేను వెళ్ళడము జరుగుతూంటుంది. కస్టమర్స్‌లో ఎక్కువ శాతము చాలా కష్టపడి పైకి వచ్చిన వాళ్ళు. ఇది మాత్రము నా అదృష్టమే. నా ఇంకో అదృష్టమేమంటే రాజకీయ నాయకులలో నీతి తప్పినవారు చాలా తక్కువ మంది మాత్రమే నన్ను పిలిచారు. ఈ విషయాలలో ఇప్పటికీ నేను తృప్తిగా ఉంటాను.

కష్టానికి గుర్తింపు నిజంగా కష్టపడేవారికి అవసరం లేదు. తూతూ మంత్రంగా ఇతరుల ముందు కష్టపడేట్లు నటించేవారు మాత్రమే గుర్తింపు కోరుకోవాలని చూస్తారు. ఎవరైతే కష్టపడి పనులు చేసుకుంటుంటారో వారితో స్నేహం పెంచుకోండి. వారిని ఎక్కువగా గమనిస్తుండండి. వారిని ఫాలో అవ్వండి. మీ జీవితం తప్పకుండా అభివృద్ధిలోకి వస్తుంది.



*e-mail : peegeess@yahoo.com,* ***Web Site : www.subhavaastu.com***

**రచయిత : సురేష్ సిద్ధాంతి. ఫోన్ : 98481 14778**

కష్టపడే ప్రతి ఒక్కరూ ధర్మంగా ఉంటారు. న్యాయార్జితాన్ని పొందాలని చూస్తారు. ఇతరుల సొమ్మును అప్పణంగా దోచుకోవాలని చూడరు. ఏ పని చేసినా శాశ్వతంగా ఉండాలని, ఇతరులకు ఉపయోగకరంగా ఉండాలని కోరు కుంటారు.

యాజమాన్య అధికారము లేకపోయినా అజమాయిషీ చేసే వారిని, ఎప్పుడూ ఇతరులను దూషించు వారిని, ఇతరుల కీడు కోరే వారిని, ఎప్పుడూ ఇతరులను తక్కువ చేస్తూ మాట్లాడే వారిని, పరాయి సొమ్మును ఎల్లవేళలా ఆశించే వారిని, కష్టపడి సంపాదించే వారిని దోచాలని చూసే వారిని, మీకు ఆమడ దూరంలో ఉంచండి. వీరి నీడ కూడా మీపై పడకుండా చూడండి. సమాజంలో మనుషులు, పశువులు ఎందరో తిరుగుతుంటారు. వీటిలో ఒకటి, రెండు పశువులను మాత్రం మనం ముట్టము, దాన్ని తగలకుండా జాగ్రత్త పడతాము అది గాడిద, పంది. వీటికన్నా హీనంగా వీరిని చూడండి. గాడిద, పందిని ముట్టినా తప్పనేది లేదు. కానీ వీరిని మాత్రం దగ్గరకు చేర్చడం తప్పు. ఒక గజ్జి పట్టిన కుక్క దగ్గరకు వస్తే మనం ఎలా జడుసుకొని దూరం పారిపోతామో, వీరిని చూసినా వెంటనే దూరంగా వెళ్ళిపోండి. వీరి వల్ల మనకు ఉపయోగం తక్కువ, తలనొప్పులు ఎక్కువ. స్థిరంగా మనం భవిష్యత్తులో అభివృద్ధి మార్గాన్ని ఎన్నుకోవాలని చూస్తాము. ఇటువంటి వారు దగ్గరున్నందువల్ల మన ఇలాంటి ఆలోచనలు పూర్తిగా దెబ్బ తింటాయి.

పుట్టాము. సమాజానికి, దేశానికి సేవచేయాలి. పుట్టాడు, చచ్చాడు అనే మాట అనిపించుకోరాదు. మహాత్మా గాంధీ గురించి ప్రతి ఒక్కరికీ తెలుసు. ఆయన ఎదురింటివారి పేరు మీకు తెలుసా? గాంధీ ఎంత కష్టపడ్డాడో జీవిత చరిత్ర చదివితే తప్ప అర్థం కాదు. అంత కష్టపడితే ఎవరికైనా గాంధీ లాంటి పేరు వస్తుంది. గాంధి ఎదురింటి వారిని నిందించాలని నా యోచన కాదు. కష్టపడే వారికి గుర్తింపు వస్తుంది. అది పిల్లల భవిష్యత్తును అభివృద్ధి పథం వైపు నడిపిస్తుంది.

ఇప్పటికీ నేను రోజుకు 15 గంటలు కష్టపడతాను. సమయాన్ని వ్యర్థం చేసుకోవడం, అనవసరంగా కాలయాపన చేయడం నాకు సుతరామూ ఇష్టం లేదు. రాత్రి పడుకొనే ముందు ఒకసారి ఆ దినం చేసిన పనులను మననం చేసుకుంటాను, ఈ రోజు బాగా కష్టపడ్డానా లేదా అనే విషయం కోసం.

ఏ గంటను వ్యర్థం చేసానో గమనించి ఇటువంటి పొరపాట్లు మరుసటి దినం రాకుండా చూసుకుంటాను.

కోట్ల రూపాయలు ఉంటేనే తృప్తి కరమైన జీవనం రాదు. వారి సమస్యలు వారికి కోట్లలో ఉన్నాయి. అలాగని కోట్ల రూపాయలు ఉన్నవారందరూ కష్టాలలో ఉన్నవారని కాదు. కష్టపడే వారే మనశ్శాంతిగా, తృప్తిగా జీవనం గడుపుతారు. పెద్ద పెద్ద కంపెనీ యజమానులను గమనించండి. దినానికి 15 నుండి 18 గంటలు కష్టపడిన వారు ఎక్కువ. వారి ప్రతిక్షణం ఆలోచన కూడా ఎలా అభివృద్ధిలోనికి పోవాలనేదే. అంతేకాని ఇంకొకరి కొంపలు ముంచాలని కాదు. అదృష్టవశాత్తూ ఇటువంటి ఒక కంపెనీ యజమాని నాకు చాలా సన్నిహిత మిత్రుడైనందువల్ల అతని గుణాలు కొంచెం నాకు వంటబట్టాయి. నిష్కల్మషమైన మనసు, ఇతరుల కీడు కోరకపోతే, ఎప్పుడూ నవ్వుతూ, హుషారుగా ఉంటే అందరూ మన స్నేహితులు అవుతారు.

ఇక ఆలస్యం చేయక నేటి నుండి కష్టపడి బ్రతకడం నేర్చుకోండి. మీలో కష్టపడే గుణాలు చాలా ఉన్నాయి. త్వరితంగా వాటిని వినియోగం చేసుకోండి. రోజులు గడిచే కొద్దీ మీ పరిస్థితులలో మార్పులు రాకపోతే నా మాటను అస్సలు నమ్మవద్దు.

వికలాంగులు చాలా మంది తమకు చేయూతనిచ్చేవారి కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చేస్తుంటారు. అదే వికలాంగులలో చాలామంది ఎవరి ఆసరా కోసం చూడక వారే కష్టపడి ఏదో ఒక ప్రత్యేకతను సాధించి అందరిచే కొనియాడ బడతారు. ఒక్క క్షణం మనము కాలులేని లేదా చేయిలేని జీవితాన్ని ఊహించుకుంటే ఎంత భయానకంగా వుంటుందో తెలుస్తుంది. భగవంతుడు మనకు అన్ని అవయవములనూ ఇచ్చినా వికలాంగ ప్రవర్తన చాలా మందిలో పోదు. అన్నీ వుండి ఏమీ చేసుకోలేని సోమరులు అసలు సిసలైన వికలాంగులు. ఒక్కసారి కష్టపడి ఏదైనా ఒక దానిని సాధిస్తే వచ్చే ఆనందం, తృప్తి ఇక ఎందులోనూ రాదు. కష్టపడి సాధించిన విజయానికి విలువ కట్టలేము. అలా కష్టపడి సాధించిన విజయాన్ని వ్యక్తపరచడానికి సంపూర్ణ పదములు లభించకపోవచ్చు. ఆ ఆనందము, తృప్తి ఎటువంటి వ్యసనాలలోనూ పొందలేవు.

## వాస్తు భారతదేశంలో తప్ప విదేశాలలో పనిచేయదా

కొందరికి ఒక నమ్మకం ఉంది. వాస్తు అనునది ఒక నమ్మకము. కాబట్టి ఎవరు నమ్మితే వారికి మాత్రమే పని చేస్తుంది. నమ్మని వారికి పనిచేయదు, అనే ఆలోచన వారికి ఎక్కువ. వాస్తు హిందువులకు మాత్రమే పనిచేస్తుంది అనేది ఇంకొందరి నమ్మకం. ఇంకొందరికి వాస్తు అనునది భారతదేశంలో తప్ప విదేశములలో పనిచేయదు అనేది ఒక ఆలోచన. ఇవన్నియూ కేవలం మూఢ నమ్మకాలు మాత్రమే. వాస్తు అనునది ఒక శాస్త్రం, నిరూపితమైన శాస్త్రం. ఈ శాస్త్రానికి ఎల్లలు, హద్దులు అనేవి లేవు.

ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు, అస్సాం, గుజరాత్, భారతదేశం, ఇంగ్లాండ్, అమెరికా, జపాన్ అను విషయాలపై ఆలోచన లేదు. ఎలాగంటే సూర్యుడిని, చంద్రుడిని రాహు కేతువులనే సర్పాలు మింగుతాయని ఓ బలమైన మూఢ నమ్మకము ప్రజలలో పాతుకొని పోయింది. సూర్యుడిని, చంద్రుడిని ఏ సర్పాలు మింగవు. గ్రహణాలు వచ్చినప్పుడు విశ్వంలో జరుగుతున్న మార్పులకు ఒక నమ్మకం కింద తెలిపితే ప్రజలు నమ్మి ఆచరిస్తారనే పెద్దల ఆలోచనకు ఇది ఒక రూపము మాత్రమే. ఇప్పటికీ కొందరు జ్యోతిష శాస్త్రం చెప్పేవారు బలంగా సూర్య చంద్రులను సర్పాలు మింగుతాయనే విషయాన్ని ప్రజల మనసులలో నాటుతుంటారు. కావాలంటే మీరు పరీక్షించుకోండి. సూర్యునికి భూమికి, చంద్రునికి భూమికి మధ్యలో ఇతర గ్రహాలు అడ్డు వచ్చినప్పుడు జరిగే పరిణామమును సూర్య గ్రహణ, చంద్ర గ్రహణాల కింద పరిగణిస్తాము. శాస్త్రీయంగా ఈ రకంగా ఇతర గ్రహాలు అడ్డు రావడం ప్రాణుల ఆరోగ్యానికి శుభకరం కాదు. సూర్య చంద్ర కిరణాలు ఆ ఇతర గ్రహాల మీద పడి పరివర్తనం చెంది భూమిపైకి ప్రసారం అవుతాయి. అప్పుడు ఆ ఇతర గ్రహాలపై ఉండే విష వాయువులు ఇతర రసాయన మిశ్రమాలు పరావర్తనమై, చేతనం పొంది భూమిపైకి ప్రసార మయ్యే అవకాశాలు చాలా చాలా ఎక్కువ. వీటి ప్రభావం వల్ల మానవ మేధస్సు, జ్ఞానానికి, మానవ మెదడుకు , శరీరానికి ఇతర ప్రాణుల ఆరోగ్యానికి కూడాను మంచిది కాదు.

అందుకే గ్రహణం తరువాత తలస్నానం చేయమని ఇల్లంతా నీటితో శుద్ధి చేయమని, ఇంటిలో మిగిలిన నీటిని పారవేయమని చెప్పడం మీరు వినే ఉంటారు. అంతెందుకు ఇవన్నీ మనం ఆచరిస్తున్నాము కూడా కదా ! ఇది శాస్త్రీయరీత్యా ఋజువు అయినదికూడా. ఇప్పుడు చూడండి గ్రహణ ప్రభావం అనేది శాస్త్రీయరీత్యా ఋజువైనది. కాబట్టి మనము ఆచరిస్తే మనకే మంచిది. అయితే సర్పము సూర్య చంద్రులను మింగుతాయనేది ఓ మూఢనమ్మకము. అనాది కాలంలోనే ఇతర ఖండాల వాసులకు గ్రహణాల గురించి జ్ఞానం లేనప్పుడే మన భారతదేశ ఋషులు, మునులు, సిద్ధాంతులు వీటిపై పూర్తిగా అవగాహన కలిగివుండి, సరి అయిన అంచనాలతో క్రమమైన పద్ధతులలో వీటి గణాంకాలను,

**ఎన్నో సమస్యలకు వాస్తు శాస్త్రం పరిష్కారమును చూపిస్తుందనే విషయం మీకు బాగా తెలుసుకదా. వాస్తుపై మీకు మక్కువ కలుగుతోందంటే మిమ్మల్ని అదృష్టం వరించినట్లే. వాస్తు పుస్తకములను చదివినందువల్ల మీకు అంతయూ మంచియే జరుగును.**

గుణాలను అనేక శ్రమలకోర్చి ఎంచి ప్రజలకు పంచారు. వీరికి ఏమిచ్చినా మన ఋణం తీరదు. కొన్ని శతాబ్దాల తరువాత పశ్చిమ దేశస్థులు ఈ గ్రహణాల గురించి, వీటి ప్రభావాలు ఫలితాలు గురించి ప్రజలకు తెలియజేయడమైనది. అప్పుడు శాస్త్రీయమైనది. అంతవరకు ఒక నమ్మకము, మూఢనమ్మకము కింద మాత్రమే కొనసాగుతూ ఉన్నాయి. ఇక్కడ సర్పము అనడం ఓ మూఢనమ్మకం. గ్రహణ ఫలితాలు శాస్త్రీయము. అలాగే వాస్తు గురించి కూడా కొన్ని మూఢ నమ్మకాలు ప్రజలలో బలీయంగా నాటుకున్నాయి. వాస్తు అనునది ఓ శాస్త్రం. ఈ శాస్త్ర ప్రభావం మొత్తం ప్రపంచంనందలి అన్ని ప్రాంతాలపై ఉంటుంది. రెండు రెళ్ళ నాలుగు. ఇది ఏ దేశంలోనైనా ఒక్కటే. దేశవిదేశాలలో ఈ పద్ధతి మారదు. జపాన్‌లో రెండు రెళ్ళ ఆరు కాదు. అక్కడ కూడా రెండు రెళ్ళ నాలుగే. అలాగే వాస్తు కూడా. దీనికి హద్దులు లేవు. కుల మతాలు లేవు. ప్రాంతాలు, రాష్ట్రాలు, జిల్లాలు లేవు. ఎవరు నమ్మినా నమ్మకపోయినా వాస్తు పనిచేస్తుంది, అన్ని ప్రాంతాలలోను, అన్ని దేశాలలోను, మీ ఊరిలో, మీ ఇంటిలో కూడా...

స్థలమున్నా, గృహమున్నా అక్కడ వాస్తు పనిచేస్తుందని గ్రహించండి. ఏమీ లేకపోతే వాస్తు పనిచేయదు. అంతేగానీ వాస్తుపనిచేయని ప్రాంతం గానీ, ప్రదేశము గాని, దేశము గానీ లేదు. వాస్తు శాస్త్రమును నమ్మినందువల్ల ఉపయోగము, లాభము, సంతోషము, మానసిక ఆనందము లభించును. వాస్తు దోషాలు ఎలా ఉంటాయో ప్రస్తుతం చదవండి.

## వాస్తు దోషాలు

వాస్తు దోషాలనేవి ఈ విధంగా ఉంటాయి. అప్పులు చేయడం, అప్పులు అధికం కావడం, అప్పులు తీర్చడం కోసమై కొత్త అప్పులు చేయడం, జీవిత పర్యంతము సంపాదన చేసినా తీరని అప్పులు, క్రుంగిపోవడాలు, ఆత్మహత్యలు, ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించడం, టెన్షన్లు, మానసిక క్షోభ, తీరని వ్యధ, గలాటాలు, కొట్లాటలు, కుటుంబంలో బేజారెత్తించే కలహాలు, భార్యాభర్తల జగడములు, పిల్లలకు విద్య సరిగా రాకపోవడం, పిల్లలు ఎదగకపోవడం, పిల్లలు పుట్టక పోవడం, మరణించడం లేదా అంగవైకల్య జననం, రోగాలు, వ్యాపారాలు సరిగా జరగక పోవడం, పెట్టుబడిపై కనీస వడ్డీ కూడా గిట్టకపోవడం, మానసిక వ్యాకులత, భాగస్థుల సమస్యలు, వ్యవహారాలు, భయంకరమైన రోగాలు, అనారోగ్యాలు, క్యాన్సరు, ఎయిడ్స్, పక్షవాతం, గుండె పోటు, రక్తహీనత, భయం భయంగా ఉండడం, అవమానాలు, బికారి కావడం, సన్యాసం పుచ్చుకోవడం, పిచ్చి పట్టడం, కాని పనుల కోసం పోరాడటం, చట్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం, తప్పుడు పనులు చేయడం, దొరికి పోవడం, వ్యభిచరించడం, ఇతర స్త్రీలపై విపరీతమైన కామ ప్రకోపాలు, ఇంటి ఇల్లాలిపై విసుగు - కోపం, అసహ్యం, కుటుంబ సభ్యుల మధ్యలో ఒకరిపై ఒకరు కీడు చేసుకోవాలని తలచడం, దాడులు చేసుకోవడం, చంపుకోవడాలు, హత్య కావింప బడటం, హత్యలు చేయడం.

దొంగతనాలు, అగ్ని ప్రమాదాలు, అకస్మాత్తుగా సంభవించే ప్రమాదాలు, చర్మ వ్యాధులు, ఉద్యోగం లభించకపోవడం, విదేశాలకు వెళ్ళాలన్నా వెళ్ళలేక పోవడం, ఇతరత్రా.

**ఆడపిల్లల విషయంలో :** ఇతరులను ప్రేమించడం, లేచిపోవడం, పెళ్ళి అయిన తరువాత పూర్వ ప్రేమికునితో కులకడం, పుట్టింటికి చేరుకోవడం, పుట్టింటి వారికి బరువు కావడం, మెట్టినింట కష్టాలు ఎదుర్కొని, భర్త బలవంతంచే పుట్టినింటివారిని ఇబ్బందులకు గురిచేయడం.

పై దోషాలను వాస్తురీత్యా సవరించుకోవచ్చు.

నమ్మండి నమ్మకపోండి, ఇలాంటివి ప్రపంచంలో జరుగుతాయా అనే సంఘటనలు కూడా చూడటమైనది. అక్షర రూపంగా వాటిని వ్రాయలేను. అసహ్య కరమైన సంఘటనలను వ్రాయడం మంచిది కాదనే ఉద్దేశ్యంతో అక్షర రూపం చేయలేదు. అయితే వారింట వాస్తు దోషాలు సవరించిన తరువాత అటువంటివి భవిష్యత్తులో జరుగకపోవడం నిజంగా వాస్తు గొప్పతనమే. భగవంతుడు మనకిచ్చిన ఈ వాస్తు సవరణల అవకాశానికి మనస్ఫూర్తిగా, హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ప్రజలకు ఓ ముఖ్య గమనిక ఏమంటే వాస్తు పనిచేస్తుందా లేదా అనే విషయం ప్రక్కన పెట్టి ఏ నిర్మాణమునైనా వాస్తురీత్యా నిర్మించుకోవాలని, తద్వారా అందరూ ఆనందంగా ఉండాలని నా హృదయపూర్వక అభిమతము.

ఎలాగూ గృహాన్ని నిర్మించుకుంటున్నారు. వాస్తుశాస్త్రరీత్యా గృహాన్ని నిర్మించడం వల్ల మానసిక ఆనందం ఎల్లవేళలా ఉంటుంది. ఒకవేళ మీకు వాస్తుశాస్త్రంపై నమ్మకం లేకపోతే ఒక పని చేయండి. వాస్తు శాస్త్రమును అసలుకు నమ్మవద్దు. గృహమును మాత్రం వాస్తుశాస్త్రరీత్యా నిర్మించుకోండి. ఇందులో ఏ తప్పు లేదు కదా. పదిమంది నడిచిన బాట సరైనదని మీకు పూర్తి అవగాహన వుంటుంది. ఆ బాటనే పట్టమని నేను మీకు విన్నవించు కుంటున్నాను.

అత్యంత శ్రద్ధతో ఈ పుస్తకమును చదివినందులకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. మీరు, మీ కుటుంబం ఆయురారోగ్యాలతో, సుఖసంతోషాలతో, భోగభాగ్యాలతో, కీర్తి ప్రతిష్ఠలతో, పిల్ల పాపలతో క్షణం తీరిక లేని పనులతో విరాజిల్లాలని ఆ దేవదేవుని ప్రార్థిస్తూ ..... సెలవు తీసుకుంటున్నాను.

భవదీయ

**సురేష్ సిద్ధాంతి**

సెల్ :- 0 98481 14778.

### నన్ను ఎలా కలవాలి !

మీరు మీ గృహమును నాతో పరిశీలింపచేయించుకోదలిస్తే క్రింద తెలిపిన సెల్‌ఫోన్‌కు కాల్ చేయగలరు. లేదా ఇ-మెయిల్ ద్వారానైనా నన్ను సంప్రదించ వచ్చును. ఇ-మెయిల్ ద్వారా అయితే ఆలస్యం కావచ్చును. కావున ఫోన్ ద్వారా సంప్రదించగలరు.

| | | |
|---|---|---|
| నా సెల్ ఫోన్ నెం. | : | **98481 14778** |
| ఇతర రాష్ట్రాలనుండి | : | **0 98481 14778** |
| ఇతర దేశాల నుండి | : | **00 91 98481 14778** |
| ఇ-మెయిల్ | : | ***peegeess@yahoo.com*** |

చిరునామా :

**సురేష్ సిద్ధాంతి,**

**దాసరిమునిదాసు,**

**పాతాళగంగ రోడ్డు, శ్రీశైలం, (ఆంధ్రప్రదేశ్)**